


THE

# Maharajah's College Magazine, VIZIANAGRAM.

A quarterly journal mainly devoted to research.

Vol. II. } JULY, 1923. { No. 4.

## Contents.

(2) ఒక కర్మ గానుండు నామవాచకమునకును దానితరువాతగల సకర్మకక్రియకును నడుమఏర్పడిన "న్" ఆగమము ద్వితీయావిభక్తి ప్రత్యయముగా ఏర్పడెను.

(3) రెండు నామవాచకములు ఒకదానికి ఒకటి విశేషణ విశేష్యసంబంధములో ఒకదానితరువాత ఒకటిఉన్నప్పుడు ఏర్పడిన "న్" ఆగమముసంబంధషష్ఠి ( Genitive ) ప్రత్యయముగాఏర్పడెను.

(4) ఒకకర్తకాని నామవాచకమునకును అకర్మకక్రియకును నడుమఏర్పడిన "న్" ఆగమము సప్తమిప్రత్యయముగా ఏర్పడినది

ఈ "న్" ఆగమమే అచ్చులమైత్రివలను, మరికొన్ని ఇతర కారణములవల్లను, "ను, ని, న" అని వేరువేరు అచ్చులతోకలసి ఇప్పుడు భాషలో నిలచియున్నవి.

[ప్రసా: — ఈ "న్" ఆగమము అసలు సర్వనామ ప్రత్యయములనుండి ఏర్పడినదిగానునను ఇదియేద్వితీయాది ప్రత్యయములుగా మారుటచేతను, సర్వనామముల తుదిభాగములకును, ఈద్వితీయాది ప్రత్యయములకును సంబంధము అతిదగ్గర. వాస్తవమున ఒక్కటిగానున్నట్లే కనబడును.]

ఈకారణముననే ప్రథమావిభక్తిరూపము తక్కిన విభక్తులకు బదులుగా ఇప్పటికిని వాడుకకు వీలగుచున్నది. పురాతనపుసాంప్రదాయములలో నిలిచిన వానియందు ఇదిఒకటి.]

ఈరీతినిఏర్పడిన ద్వితీయాది ప్రత్యయములును భాషలో రూఢిగాయగుటన్నయకుపూర్వమే. ద్వితీయాదివిభక్తులకు బదులుగా ప్రథమనువాడు సాంప్రదాయమునుబట్టి సంధిజరుగగల స్థానములలో జరిగించి ఏర్పరచినరూపములు ఒకసెట్టును ఆయాప్రత్యయములు వెల్లడిచేసి సంధిచేసిన రూపములు ఇంకొకసెట్టును, భాషలో కనబడుటచే ఇచ్చట "న్" ఆగమముగా వచ్చినదని అనుకొనుచున్నాము.

సామ్యము ( analogy ) వల్ల తుదిఅచ్చుకు ఉచ్చారణ స్థానము దగ్గర గాలేనిహల్లు ఆగమముగావచ్చుట తెనుగులోనేగాక ఇతరభాషలలోను కలదు. ఇంగ్లీషులో « ఇండియ ఆఫీసు ( India Office ) " అనుటకుబదులుగా « ఇండియరాఫీస్ " అనికొందరు ఉచ్చరించుదురు. ఇచ్చట రెండచ్చులకు సంధిజరుగక « ర్ " ఆగమముగావచ్చినది. ఆవిషయమునందైనను « ర్ "కును « అ, ఒ "లకును సామ్యములేకున్నను ఇదిఆగమముగావచ్చుటకు కారణమేమనగా:- ఇంగ్లీషులో మాటలతుది « ర " కారమును ఇంగ్లీషువారు ఒకఅచ్చుగా పలుకుదురు; కాని అట్టిమాట వెంటనే అచ్చుమొదటగలమాట పలుకవలసినప్పుడు ఆ « ర " కారములోపించక, రెండచ్చులమధ్యను « ర్ " గాకనబడుచుండును ఇండియ ( India )అనుమాటలో తుదిధ్వనిఅచ్చు. ఆఫీస్ ( Office ) అనుదాని మొదటిధ్వనికూడఅచ్చే. వారిభాషలో వేరువేరుమాటలకు చెందియున్న రెండచ్చుధ్వనులు వరుసగారావు. ఒకవేళవచ్చిన (అనగా మాటతుది « ర " అచ్చుగామారుటచేత, ఒకటియును, దానితరువాతమాట అచ్చు మొదలుగాగలదానినుండి ఇంకొకటియును వరుసగావచ్చిన) అచ్చుగామారిన « ర్ " కారముతిరిగి ఆరెండుఅచ్చులకు మధ్యనుకనబడుచున్నది. కాబట్టి, ఈ « ర్ " అనుధ్వని ఎలవెలవడుచున్నదో అనుజ్ఞప్తిలేక, రెండుమాటలకు చెందియున్న రెండచ్చులు వరుసగావచ్చుటవచ్చినను వారు « ర్ "అనుధ్వనిని ఆగమముగా పలుకుచున్నారు.

ఇందుకు ఉదాహరణములు:—

Water అనుమాటలో తుది « ర్ " అనుధ్వనిని అచ్చుగామార్చి పలుకుదురు. ఈమాటవెంబడిన ఒకహల్లు ఆదిగాగల మాటవచ్చినయెడల ఇదిపలుకదు- Water for me కాని అచ్చు ఆదిగాగలమాట వచ్చినయెడల దీనిని పలుకవలసివచ్చును— Water of the Ganges సాధారణముగా పలుకని « ర " కారము రెండచ్చులమధ్యను ఇచ్చట కనబడుచున్నది. [ఇదినిజమున ముందు మాటలోనిది.] కాబట్టి ఏరెండచ్చులమధ్యనైనను « ర " కారము ఆగమముగా వచ్చుచున్నది.

VIII. I, II, IV. IX సూత్రములలో చెప్పిన స్థలములందు తప్ప తక్కినస్థలములయందు తుది ఇకారఅకారములకు సంధివైకల్పికము.

ఉదాహరణములు:—

ఇకారమునకు —

(1) వెండుంగరము, వెండియుంగరము [5 గు.] సర్వ. సా. సం.

(2) తెలివోంది, తెలివినోంది [5. గు.] (భార. ఉద్యో. 1ఆ)

(3) మఱ్ఱాకు, మఱియాకు [4. గు.] హరి. ఉత్త. 9ఆ)

(4) రావాకు, రావియాకు [4. గు.] ఋక్మాం. 1ఆ)

ఇచ్చట, ఐ, ఆ అనుధ్వనులకు నడుమగానున్న ధ్వని ఏర్పడుటచే అర్థమగుచున్నది.

(5) ఏమంటివి, ఏమియంటివి.

(6) మగనాలు, మగనియాలు [5. గు.] (సర్వ. సా. సం)

(7) పురటాలు, పురిటియాలు [5. గు.] (సర్వ. సా. సం)

(8) పెండ్లాడి, పెండ్లియాడి [5. గు.] సర్వ. సా. సం)

(9) కూర్చుండి రొండొరుంగదిసి, కూర్చుండిరి యొండొరుంగదిసి [7. గు.] (నైష. 8ఆ)

(10) తాటాకు, తాటియాకు [5. గు.] (చూ. 3, 4 ఉదాహరణములు)

(11) పైడందెలు, పైడియందెలు [5. గు.] (సర్వ. సా. సం)

(12) పాయిరాజనట్టి, పాయిరాజనియట్టి [5 గు. (పాండు. 1ఆ)

(13) నుతిసేయనట్టి, నుతిసేయనియట్టి [5. గు] (రుక్మి. 2ఆ)

(14) వచ్చిరప్పుడు, వచ్చిరియప్పుడు [6. గు.]

(15) ఏలితివపుడు, ఏలితివియపుడు. [7. గు.]

15 (ఎ) కనుదోయొలయన్, కనుదోయియొలయన్ [5. గు.] (భార. శల్య 1ఆ)

(16) ఎనిమిదవది, ఎనిమిదియవది [11. గు]

(17) తొమ్మిదవ, తొమ్మిదియవ [11. గు.]

(18) పదవది, పదియవది. (పదోది) [11. గు.]

(19) పదునొక్కటవ, పదునొక్కటియవ [11. గు]
(20) పదునారు, పదియారు [చూ. 1సూ]
(21) అరువదారు, అరువదియారు [11. గు,]
(22) బంతిది, బంతియిది [5. గు.] (ఆం. భా భూ)
(23) బండెద్దు, బండియెద్దు [5. గు,] (సర్వ. సా. సం)
(24) తండేడి, తండియేడి [5. గు.] (సర్వ. సా. సం)
(25) తెలివెందును, తెలివియెందును [5. గు.] (భార. ఉద్యో, 2ఆ)
(26) ఒకవేల, ఒకటియేల [5. గు.] (భార. ఉద్యో. 1ఆ)
(27) పొ్రియ్యడునుగాని, పొ్రియ్య యిడునుగాని [5. గు.] (భార. విరా.1ఆ)
(28) ఇట్టితండెవ్వధి, ఇట్టియితండెవ్వధి [5. గు. ] (భార. విరా. 6ఆ)
(29) డెబ్బదేను, డెబ్బదియేను [5. గు.] (భా. ద్రోణ. 4ఆ)
(30) అరువదేను, అరువదియేను [5. గు.] భా(భార. కర్ణ. 2ఆ)
(31) వచ్చితిమిప్పుడు, వచ్చితిమియిప్పుడు [6. గు ]
(32) ఏలితనిపుడు, ఏలితవియిపుడు [7. గు.]
(33) ఏమేమి, ఎమియేమి [10. గు.]
(34) ఎగేగి. ఎగియేగి [10. గు.]
(35) మనవేటికి, మనవియేటికి [వీరేశలింగం వ్యాక.]
(36) ద్రోచితిరెచ్చట, ద్రోచితిరియెచ్చట [7. గు.]

వరా:—(1) VI, VII, సూత్రములలో వివరించిన "ను, కు" మొదలగు ఉకారాంత ప్రత్యయములు అచ్చుల పరతవల్ల "ని, కి" అని ఇకారాంతములుగా మారుచున్నవి. ఆసూత్రములలో "ను, కు" లనుచెప్పిన కారణములనేఇచ్చట "ని, కి" లను వర్తింపజేయవలెను.

[ తెలివి + ఒంది → తెలివినొంది, అని "న్" ఆగమము గా వచ్చుటకు కారణము ఇదే.] చూ

(2) ఎకారసంధి ఇకారసంధిని పోలియుండును.

అకారమునకు:—

(1) చూడకుండెను, చూడకయుండెను [4. సూ.]
(2) చేష్టుడిగె, చేష్టయుడిగె [4. సూ.] (ఆ ము. 4ఆ)
(3) రాజులొద్ద, రాజులయొద్ద [4. సూ.] (భార. ఆది. 68ఆ)
(4) తలిదండ్రులొద్ద, తలిదండ్రులయొద్ద [4. సూ.] (భార అర. 2ఆ)
(5) ఆర్యులొద్ద, ఆర్యులయొద్ద [4. సూ.] (భాగ. సప్త)
(6) మేనల్లుడు, మేనయల్లుడు [4. సూ]
(7) గంగనుకాసె, గంగయనుకాసె [4. సూ.] (ఆము. 2. ఆ)
(8) రంగభర్తంచు, రంగభర్తయంచు [4. సూ.] (ఆము. 6ఆ)
(9) చింతాకు, చింతయాకు [4, సూ.] పాండు. 4ఆ)
(10) కొండంత, కొండయంత [4. సూ.]
(11) గోడంత, గోడయంత [4. సూ.]
(12) తనంత, తనయంత [4. సూ.] (నిర్వ, 1 )
(13) సురారులమ్మ, సురారులయమ్మ [4. సూ.] (భా గ. ప్రథమ)
(14) రాములందు, రాములయందు [11. సూ]
(15) రాజులాజ్ఞ, రాజులయాజ్ఞ [4. సూ.] (భార. విరా. 1ఆ)
(16) పుట్టినిల్లు, పుట్టినయిల్లు [4. సూ ] పుట్టిల్లు
(17) నెలతిచ్చెను, నెలతయిచ్చెను [సూ]
(18) తామరసనేత్రిలిండ్ల, తామరసనేత్రిలయిండ్ల [4. సూ.] (మను. 2ఆ)
(19) ఇంటింట, ఇంటనింట [4. సూ.]
(20) ఇంచుకించుక, ఇంచుకయించుక ఇంచించుక [41. సూ]

వరా:—VIIవ సూత్రములలో చెప్పిన "ను" ప్రత్యయము, "ను" గురించి సంధికాగనగూలన్ల "న" కును వతింపజేయవలయును. [ఇంట+ఇంట=ఇంటనింట, అని వచ్చుటకు కారణము ఇదే.]

IX విరామమందు సంధిజరుగదు; చేయుట దోషము.

వ్యాఖ్యానము:—అరమాత్రకాలము ఒక అచ్చునకును ఇంకొకదానికిని విరామము ఉన్నయెడల సంధియెన్నడును జరుగదు. ఈదిగువనుదహరించిన స్థలములలో విరామముకలుగును:—

(1) సంబోధనతరువాత ఉదా:—కొమ్మ + ఇందము = కొమ్మయిందము

(2) ఏవార్థముతరువాత-ఉదా:—నీవ + అనుంగుజెలివి = నీవ యనుంగుజెలివి.

(3) ఒకమారు ఊపిరివిడమటకును, ఇంకొకమారు ఊపిరివిడచుటకును మధ్యను.

మనభాషలో ఊపిరివిడుచుటచేత కలిగినధ్వనులనే వాడుచు మనయభిప్రాయములను వెల్లడిచేయుచున్నాము, ఒకమారు ఊపిరివిడచుట అయినపిమ్మట తిరిగి ఊపిరిలోనికిపీల్చినగాని, మరల ఊపిరివిడువజాలము, కాబట్టి మొదట ఊపిరివిడుచునప్పుడు కలిగించినధ్వనులకును, రెండవమారు ఊపిరివిడుచునప్పుడు కలిగించిన ధ్వనులకును నడుమను ఊపిరిలోనికిపీల్చుటకు కావలసినంతకాలము విరామముఉండును, ఇది అరమాత్రకన్న హెచ్చుపట్టునని అందరును ఎరుగుదురు. కాబట్టి ఒక్క ఊపిరినివిడచునప్పుడు ఒక్కమారుగా పలుకగలమాటలు సముదాయపు తుదిఅచ్చునకును, దానితరువాత ఊపిరివిడచునప్పుడు పలుకు మొదటిమాట అచ్చునకును సంధిజరుగదు— ఉదా:—నేనింటికివచ్చినప్పుడు । అతడు నాకగపడవలెను. [ నిలువుగావ్రాసిన [గీత] ఊపిరివలనకలిగిన విరామమునుసూచించుచున్నది. ]

(4) వాక్యాంతమందు ఉదా:—సత్యంబుతో సరియుగావు ఎరుగుమెల్లధర్మములకు.

(5) ఏఒక్కమాటనుగాని, మాటలసముదాయమునుగాని నొక్కిచెప్పవలసివచ్చినప్పుడు క్వార్థక[క్రియయొక్క భావమును నొక్కిచెప్పవలసివచ్చినప్పుడు]

ఉదా:—నీవుకోటకువెళ్ళి, ఇచ్చటకు రావలెను. [వెళ్ళినిది రాకూడదని భావము]

ఈఅచ్చుసంధివిషయము మహాసముద్రమువలె పరిమితిలేనిది. నేనువ్రాసిన యీవ్యాసమునందు అచ్చటచ్చట లోపములున్నట్లు నాకే కనబడుచున్నది. నాఅభిప్రాయములను వెల్లడిచేసినగాని ఇవితీరవనుతలంపుతో వానిని వెల్లడిచేసితిని. మహనీయులు దీనిని విమర్శించి లోపములను సవరించ ప్రార్థితులు.

నామనస్సులోఉన్న ఉద్దేశములకు తగినమాటలు నాకుదొరకక వ్యాకరణములలోనిమాటలు, సూత్రము, వ్యాఖ్యానమువంటివి నేను ఉపయోగించితిని. "సూత్రము" అని వ్రాయుటలో దానిలోనున్న అభిప్రాయప్రకారము విధిగా సంధిచేయవలయునని నాఉద్దేశముకాదు. కాని ఇప్పటికి భాషలోఉన్న పోలికగల సంధివిషయములను అన్నిటిని పోగుచేసి వానిలోగల సారాంశమును సూచింపుమని నాఅర్థము. విధించుసూత్రములేనిది సంధిచేయుట ఎట్లు అని ప్రశ్న కలుగవచ్చును. తెనుగుప్రజల ఉచ్చారణయే విధించుసూత్రము. వారుసంధిచేసినచోట చేయుము చేయనిచోట చేయకుండవలెను; వ్రాసినసౌకర్యముగల స్థలములందు ఉచ్చారణలో సంధులను వ్రాయవచ్చును. లేనిస్థలములందు విడువవలెను.

ఆమ్రేడితములనుగురించి:— ఆమ్రేడితములు తెనుగులో అనేకఅర్థములయందు ఉపయోగించుచున్నారు. వానిలో ముఖ్యమగునవి ఏవనగా:—

(1) ఆశ్చర్యమును సూచించుటకు— ఆశ్చర్యము అనునది ఒక్కొక్కప్పుడు అతిహెచ్చుగాను, ఇంకొకప్పుడు కొంచెముగాను మనస్సులో కలుగుచుండును. హెచ్చుగాకలుగునా, తక్కువా అనువిషయము ఆశ్చర్యమును కలుగజేయు దానిని బట్టిఉండును. హెచ్చుగానున్నదానిని వెల్లడించునప్పుడు సంధిచేసి తక్కువగానున్నప్పుడు సంధిచేయము.

(పరిచయముఉన్నవారు కనబడినప్పుడు) ఓహూ, ఓహో, ఎప్పుడు వచ్చినారు?

(ఒకవిడ్డూరపు కబురు విన్నతరువాత) ఓహోహో, ఏమి ఈవిడ్డూరము! [10. సు.]

ఇట్లే:—ఔర, ఔర, ఔరౌర. [10. సూ.] సంధిచేయనప్పుడు ఆగమము రాదు.

(2) "ప్రతి" (Every) అను అర్థములో—ఈఅర్థమును నొక్కి చెప్పవలసివచ్చినప్పుడు సంధిచేసి, అవసరములేనప్పుడు చేయక పలుకుదురు.

ఉదా:— ఊరూర, ఊరూర, ఇవి రెండేమాటలు.

ఊరూరతిరిగినాడు గాని, ఒక్క దమ్మిడియైనను దొరకలేదు.

అక్కడ, అక్కడ × స్ఫోటకము ఉన్నదని అనుకొనుచున్నారు

అక్కడక్కడ, సిపాయిల గుంపులు కనబడుచున్నారే?

సంధి చేయనప్పుడు ఆగమము రాదు

(3) క్రియలో మిగిలియున్నపనిని చాలాకాలము జరిగినదని చెప్పుటకు

ఉదా:— ఏగి + ఏగి ఏగియేగి, ఏగేగి

పేదరాలు మొదలగుశబ్దములగురించి:— "పూజారియిల్లు" అనగా పూజ (చేయు) వారిఇల్లు అని భావము. గౌరవమునుసూచించుటకు "వారి" అని చేర్చుట వాడుక. ఇందుకు ఉదహారణముగా "అన్నూరివారిఆడుబిడ్డ" అనుదానిని తీసికొనవచ్చును. ఇట్లు గౌరవముకొరకు "అరు" అనుబహువచన ప్రత్యయము చేర్చగా ఏర్పడిన ఈరూపములు. నిజమున "పేదలయిలు" అని అర్థము. ఇట్టిపదములుభాషలో రూఢికాగానే వీనిసామ్యమునుబట్టి "గుణవంతురాలు, ధీరురాలు, జవరాలు, బాలింతరాలు" మొదలగురూపములేర్పడినవి.

ఇట్లే:— ముద్దరాలు, కోమరాలు, అయిదవరాలు, మనుమరాలు, ప్రోడ్రాలు. మొదలగునవి.

"పేద" మొదలగునవి "పేదరు" అను విశేష రూపములుగా ఏర్పడును గాన ఇవి ఉకారసంధికింద తీసుకొనవలెను.

చెన్నపట్టణం

కాస్తూరి సూర్యనారాయణ.

# అర్థాలంకారములు.



దండి, భామహుఁడు, వామనుడు మొదలగు ప్రాచీనాలంకారికుల కాలము నాటికీయర్థాలంకారముల సంఖ్యమిక్కిలితక్కువగానుండెను. రానురాను కాలక్రమమున జయదేవునికాలమునకవి శతసంఖ్యాకములయ్యెను. దండికావ్యాదర్శమందిట్లు వ్రాసియున్నాఁడు.

"కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ప్రచక్షతే। తేచాద్యాపివికల్ప్యంతే కస్తాన్ కార్త్స్న్యేనవక్ష్యతి॥"

కావ్యశోభనుగలిగించుధర్మములకలంకారములని పేరు. అవిఉక్తివైచిత్ర్యమూలములు. కవులఉక్తివైచిత్ర్యమునకువిరామము లేదుగావున నలంకారసంఖ్యకుఁ గూడఁ బరిమితి లేదు. దండికిఁబూర్వులైన యాలంకారికులవృత్తాంతమును మనము నిశ్చయింపజాలముగానియతనికిదరువాత వారుతమగ్రంథములయందు వ్రాసినయలంకారములసంఖ్యఅవ్యవస్థితముగానున్నది. వామనుడుకావ్యాలంకారసూత్రమందుముప్పదిమూఁడలంకారములను మాత్రమేచెప్పెను. మమ్మటుడుకావ్యప్రకాశికలోనరువదింటినుదాహరించెను. భోజరాజుసరస్వతీకంఠాభరణమందిరువదినాల్గింటినివ్రాక్రుచ్చెను. ఆచార్యహేమచంద్రునికావ్యానుశాసనమందిరువదితొమ్మిదిచూపఁబడెను. రుద్రటుఁడు తన యలంకారశాస్త్రమందు ముప్పదియయిదలంకారములనుజెప్పియర్థాలంకారప్రకరణమునుముగించెను. కావ్యదర్పణకారుడరువదింటినిబ్రతిపాదించెను. సాహిత్యదర్పణకారుఁడు డెబ్బదింటినినిరూపించెను. అలంకారసర్వస్వకారుడగురాజానకరుయ్యకుడు డెబ్బదిమూఁడింటినిగనపరచెను. జయదేవుడేకోనవింశత్యుత్తరశతమునుసమర్థించెను. విద్యానాథుఁడరువదియెనిమిది, ధర్మసూరిడెబ్బదియుదు, జగన్నాథపండితుఁడు (పండితరాయలు) రసగంగాధరమందుఁగ్రంథపాతముకాఁగా మిగిలినదానియందరువదియేడలంకారములనుబ్రకటించెను. అలంకారశాస్త్రకర్తయగు విశ్వేశ్వరపండితుఁడు డెబ్బదియారింటినిగ్ర

హించెను. కావున దండిచెప్పినట్లవ్యవస్థితముగానున్న యీయర్థాలంకారములనె వ్వఁడుపూర్ణముగాఁబ్రతిపాదింపసమర్థుఁడగును.

«కింతుబీజకవికల్పానాంపూర్వాచార్యైః ప్రదర్శితమ్ తదేవపరిసంస్కర్తుమయమస్మత్పరిశ్రమః'' కానియీయలంకారవికల్పములకుబీజమెద్దియో దానిని బూర్వాచార్యులు కనపర్చియున్నారు. దానినిసంస్కరించుటకుబ్రయత్నించుచున్నాము.

దండి—కావ్యాదర్శమందు «1 స్వభావోక్తి 2 ఉపమ 3 దీపకము 4 ఆవృత్తి 5 రూపకము 6 ఆక్షేపము 7 అర్థాంతరన్యాసము 8 వ్యతిరేకము 9 విభావన 10 సమాసోక్తి 11 అతిశయోక్తి 12 ఉత్ప్రేక్ష 13 హేతువు 14 సూక్ష్మము 15 లవము 16 క్రమము 17 ప్రేయోలంకారము 18 రసవత్తు 19 ఊర్జస్వి 20 పర్యాయోక్తి 21 సమాహితము 22 ఉదాత్తము 23 అపహ్నుతి 24 శ్లేష 25 విశేషము 26 తుల్యయోగిత 27 విరోధము 28 అప్రస్తుతప్రశంస 29 వ్యాజస్తుతి 30 నిదర్శన 31 సహోక్తి 32 పరివృత్తి 33 ఆశీస్సు 34 సంకీర్ణము 35 భావికము''అనునీముప్పదియయిదలంకారములనుమాత్రమే చెప్పియుండుటచేనతనికాలమునకివియే వాడుకలోనుండెనని మనమూహించుకొనవలయును.

ఈదండిచేసినయుపమారూపకాద్యలంకారవర్గీకరణము (classification) మిగులవిలక్షణముగానున్నది. ఇట్టివిలక్షణవర్గీకరణమితనితరువాతవారైనవామనుఁడు కావ్యప్రకాశికాకారుఁడుభోజరాజు మొదలగువారెవ్వరును తమగ్రంథములయందు జేసియుండలేదు.

ఇతఁడుపమాలంకారమునకు«యథాకథంచిత్సాదృశ్యంయత్రోద్భూతంప్రతీయతేఁ ఉపమానామసా'' అనిసామాన్యముగానుపమాలక్షణము జెప్పితరువాత «1 ధర్మోపమ 2 వస్తూపమ 3 విపర్యాసోపమ 4 అన్యోన్యోపమ 5 నియమోపమ 6 అనియమోపమ 7 సముచ్చయోపమ 8 అతిశయోపమ 9 ఉత్ప్రేక్షితోపమ 10 అద్భుతోపమ 11 మోహోపమ 12 సంశయోపమ 13 నిర్ణయోపమ

14 శ్లేషోపమ 15 సమానోపమ 16 నిందోపమ 17 ప్రశంసోపమ 18 ఆచిఖ్యాసోపమ 19 విరోధోపమ 20 ప్రతిషేధోపమ 21 చటూపమ 22 తత్త్వాఖ్యానోపమ 23 అసాధారణోపమ 24 అభూతోపమ 25 అసంభావితోపమ 26 బహూపమ 27 విక్రియోపమ 28 మాలోపమ 29 వాక్యార్థోపమ 30 ప్రతివస్తూపమ 31 తుల్యయోగితోపమ 32 హేతూపమ'' అని యుపమాలంకారములో ముప్పదిరెండుభేదములను పరిగణించెను. కానియితడు చెప్పిన యీయుపమావాంతరభేదములన్నియు నవీనులు చెప్పిన స్వతంత్రాలంకారములుగాని వేరుకావు. ఎట్లనగా; పైనవ్రాసిన వానిలో ధర్మోపమయనునది నవీనులపూర్ణోపమ. వస్తూపమ ''ఇందు తుల్యాస్యా'' అను నవీనుల ఉపమాప్రకరణ మందు చెప్పఁబడిన ధర్మలుప్త। విపర్యాసోపమప్రతీపాలంకారమే। కవి సమయసిద్ధమయిన ప్రసిద్ధోపమానోపమే యభావవిపర్యాసముచేవిపర్యాసోపమయని పేరొందెను. అన్యోన్యోపమ యనునది ఉపమేయోపమకు నామాంతరము. నియతోపమతో సంపదించునది నవీనాలంకారములలో నెద్దియు గానరాదు. సముచ్చయోపమకు దుల్యమయినదానిని నవీనులుపమాభేదములలో జెప్పలేదు. ఉత్ప్రేక్షితోపమ ప్రతీపాలంకారభేదము అద్భుతోపమ ''అసంబంధే సంబంధాతిశయోక్తి'' అని కావ్యప్రకాశకారుడు విశ్వనాథకవిరాజు నభిప్రాయపడి యిట్టి యర్థముగల శ్లోకములనే ఉదాహరించిరి. ''యదిస్యాన్మండలేసక్త మిందోరిందీవరద్వయమ్। తదోపమీయతేతస్యావదనం చారులోచనమ్'', ఉభౌయదివ్యోమ్ని పృథక్ప్రతేతామాకాశగంగాపయసః ప్రవాహౌ। తేనోపమీయేత తమాలనీలమాముక్తముక్తాలత మస్యవక్షః (శిశు పా 3 సర్గ 8 శ్లో) భోజరాజుదీని నుత్పాద్యోపమయని పేరిడెను. మఱికొందరు నవీనులు దీని నద్భుతోపమయని వాడిరి. దానిలక్షణ మిట్లు చెప్పిరి. ''యత్రోపమేయధర్మాస్స్యు రుపమానేధిరోపితాః। చమత్కార విధానార్థంతా మాహురద్భుతోపమామ్''

మోహోపమ యిప్పటివారిభ్రాంతిమదలంకారము. కాని కొందరు నవీనులుకూడ ''ప్రతియోగినమారోప్యతదభేదేనకీర్తనమ్। ఉపమేయస్యయన్మోహోపమా సౌభ్రాంతిమద్వచః'' అని మోహోపమకు లక్షణము జెప్పిరి. దర్పణకారుడు దీనిని భ్రాంతిమదలంకారమని వ్యవహరించెను. సంశయోపమ

సందేహాలంకారమునిర్ణయోపమ — ఇది సందేహాలంకారముయొక్క భేదమయిన నిశ్చయాన్త సందేహము. శ్లేషోపమ — దీనిలో నర్థశ్లేషమహిమచే నుపమానోపమేయగతసాధర్మ్యము తెలియజేయబడుచున్నది. సమానోపమ — ఇది కేవల శబ్దశ్లేష విషయము.

నిందోపమ — ఇది నవీనుల వ్యతిరేకాలంకారమునకు దగ్గరగానుండును గాని దానికంటె గొంచెము భేదముగలది. ఇది సామ్యమాత్రపర్యవసాయి. వ్యతిరేకము భేదపర్యవసాయియని యెఱుంగునది ప్రశంసోపమ. ఇదికూడ బ్రతీపమే.

ఆచిఖ్యాసోపమ — ఇట్టిది నవీనోపమాభేదములలోలేదు. విరోధోపమ — దీనికిఁగూడఁ బ్రతీపాలంకారమే మూలమని చెప్పవచ్చును. ప్రతిషేధోపమ — దీనిలో ముఖాదికమునకు జంద్రాదులతో సాదృశ్యమేలేదని ప్రతిషేధించుటవలన నధికవైచిత్ర్యము ప్రకటింపబడుచున్నది. నిందోపములో నిందచే సాదృశ్యము నివారింపబడుచున్నది. చటూపమ — ఇది ప్రియోక్తి ఘటితమగుటవలన చటూపమయని చెప్పబడుచున్నది. దీనిలో జంద్రుని కధికసామగ్రియున్నను ముఖముకంటె నతిశయింపలేక సముఁడాయెనని చెప్పుటచే నుత్కర్షకారణమున్నను తత్కర్షము కలుగలేదని ప్రతిపాదించుటవలన విశేషోక్త్యలంకారమగుచున్నది. ఈయలంకారమునకు విశేషోక్తిమూలము. తత్త్వాఖ్యానోపమ — "ఇవి నేత్రములుకాని తుమ్మెదలుకావు. ఇది ముఖముకాని పద్మముకాదు" అని సాదృశ్యమును స్పష్టముగా వ్యక్తపఱచుటవలన భ్రమను నిరసించి తత్త్వము చెప్పబడుచున్నది. నిర్ణయోపమలోఁ దత్త్వాఖ్యానము సంశయపూర్వకముగా నుండును. దీనిలో భ్రాంతిపూర్వకముగానుండును. అసాధారణోపమ — నవీనమతప్రకారమిది అనన్వయము. అభూతోపమ — ఒకచోటఁగూర్చిన సర్వపద్మప్రభాసారమువలె నీముఖము ప్రకాశించుచున్నది యనగా నభూతోపమ. సర్వపద్మప్రభాసార మొకచోటఁగూర్చుట యెప్పుడు జరగనిపనిగావున దీనికి నభూతోపమయని పేరుకలిగినది. దర్పణకారుడీ యలంకారమునుత్ప్రేక్షయని చెప్పెను. అసంభావితోపమ — చంద్రచందనములనుండి విషపావకనిస్సరణ మొల్లసం

భావితమో అట్లనే నీముఖమునుండి పరుషోక్తి వెల్వడుట యసంభావితమని చెప్పగా నసంభావితోపమ. బహూపమ దీనిని దర్పణకారుడు మాలోపమయని చెప్పెను. "మాలోపమా యదేకస్యోపమానం బహుదృశ్యతే" అని దానిలక్షణము. విక్రియోపమ—నీముఖము చంద్రబింబమునుండి సముత్కీర్ణమయినదానివలె నున్నది. పద్మగర్భమునుండి తీయబడినదానివలెనున్నది" అని పలుకగా విక్రియోపమ-చంద్రబింబపద్మగర్భములు ప్రస్తుతమగు ముఖమునకు ప్రకృతులు. ముఖము వికృతి. కావున నిది విక్రియోపమ. "ఉపమేయస్య యత్రస్యాదుపమానవికారతా । ప్రకృతేర్వికృతేస్సామ్యాత్తామాహుర్విక్రియోపమామ్ (ఉపమేయమునకుపమానవికారత కలుగుటచే ప్రకృతివికృతులకు సామ్యము ప్రతీయమానమయినచో విక్రియోపమ) ఇచట ధర్మములగు సుతీక్ష్ణత్వోద్ధృతత్వములు రెండును ఉత్ప్రేక్షింపబడుటచే ముఖచంద్రులకు సామ్యము ప్రతీయమానమగుటవలన నుపమగాని యిదియుత్ప్రేక్ష గాదని యెఱుంగునది. మాలోపమ—ఇది నవీనాలంకారికమతమందుగూడనున్నది. పూర్వోక్తమగు బహూపమలో నుపమానబాహుళ్యము. ఇందులో నుపమానములకు బరస్పరసంబంధము. ఇదియే యీరెండింటికిఁగల భేదము. వాక్యార్థోపమ—ఇందులో నొకవాక్యార్థము మఱియొకవాక్యార్థములో నుపమేయింపబడును. ఇదియొక ఇవశబ్దముగలది అనేకేవశబ్దములుగలదియని రెండువిధములు. వానిలోనొక్క ఇవశబ్దముతోఁగూడినదానికుదాహరణము.

"త్వదానన మధీరాక్షమావిర్దశనదీధితి । భ్రమద్భృంగమివాలక్ష్య కేసరం భాతిపంకజమ్." "దీనిలో భ్రమద్భృంగమివ" అనుచోట నొక్కటియే ఇవశబ్దము. హెచ్చుఇవశబ్దములుగలదాని కుదాహరణము. "నళిన్యా ఇవతన్వంగ్యాస్తస్యాః పద్మమివాననం । మయా మధువ్రతేనేవ పాయంపాయమరమ్యత" ఇందులో గూడ ఇవశబ్దము లున్నవి. ప్రతివస్తూపమ—నవీనులు వ్యవహరించు ప్రతివస్తూపమయే యిది. సామాన్యధర్మము పర్యాయపదములచే వేరుగా నిర్దేశింపబడును. తుల్యయోగోపమ—ప్రస్తుతాప్రస్తుతముల కేకజాతీయక్రియచే సాదృశ్యము చెప్పుట తుల్యయోగోపమ—అనగా నొక హీనుని యధికునితో స్నే

క జాతీయక్రియచే సమము గాఁజేసి వర్ణించినట. ఇది తుల్యయోగితాలంకారము లో "గుణోత్కృష్టైః సమీకృత్య వచోన్యా తుల్యయోగితా" అను దీనితు ల్యయోగితలో భేదము.

## ఉపమాదోషములు.

"నలింగవచనే భిన్నే నహీనాధికతాపివా । ఉపమాదూషణాయాలం యత్రోద్వేగోనధీమతామ్" వినువారికిఁ జదువువారికి మనస్సులలో నుద్వేగము పుట్టింపనియెడల భిన్నములగు లింగవచనములుగాని హీనోపమయును నధికోపమయును గాని యుపమను దూషింపజాలవని దండియభిప్రాయము. హీనత్వము, అధికత్వము, వచనభేదము లింగభేదము, విపర్యయము, అసాదృశ్యము, అసంభవమునను నీయేడు నుపమాదోషములు.

వామనుడుకూడఁ గావ్యాలంకారసూత్రమందీదోషముల నిట్లు వాక్రుచ్చెను.

హీనత్వాధికత్వలింగవచనభేదాసాదృశ్యాసంభవాస్తద్దోషాః హీనత్వము అధికత్వము, లింగవచనభేదము, అసాదృశ్యము, అసంభవమునను నివి ఉపమాదోషములు.

జాతిప్రమాణధర్మన్యూనతోపమానస్య హీనత్వమ్.

జాతిప్రమాణధర్మములచే నుపమానమునకు న్యూనతను ( Inferiority) కలిగించుట హీనత్వము.

జాతిన్యూనత—"చండాలైరివయుష్మాభిస్సాహసం పరమంకృతమ్."

పరిమాణన్యూనత—"వహ్నిస్స్ఫులింగ ఇవభానురయంచకాస్తి"

ధర్మన్యూనత—"సమునిర్లాంఛితోమౌంజ్యాకృష్ణాజినపటంవహన్ । వ్యరాజన్నీలజీమూతభాగాశ్లిష్టఇవాంశుమాన్" ఇచట మౌంజికిఁ బ్రతిగా విద్యుత్తు చెప్పబడలేదు. గావున ధర్మన్యూనత.

జాత్యాధిక్యము—"విశంతు వృష్ణయశ్శీఘ్రం రుద్రాఇవమహౌజసః" ఇచ

౦ వృక్షములకంటె రుద్రులు జాతిచే నధికులు.

ప్రమాణాధిక్యము—"పాతాళమివ నాభిస్తే స్తనౌ క్షితిధరోపమౌ। వేణీదండః పునరయం కాళిందీపాతసన్నిభః" ఇచట నాభికంటెఁ బాతాళము స్తనములకంటె క్షితిధరములు, వేణికంటె గాళిందీప్రవాహము పెద్దవి.

ధర్మాధిక్యము—సరశ్మిచంచలంచక్రం దధద్దేవో వ్యరాజత। సబాడబాగ్నిస్సావర్త స్స్రోతసా మివ నాయకః" ఇచట బడబాగ్నికి మారుగా నుపమేయపక్షమున నింకొకటి చెప్పబడవలెను. అదిలేదు.

ఉపమానోపమేయయోర్లింగ వ్యత్యాసో లింగభేదః॥

ఉపమానోపమేయములు భిన్నలింగములలో నుండుట లింగభేదము.

ఉ॥ "సైన్యానినద్య ఇవజగ్మురనర్గళాని ఇందులో నుపమేయమగు సైన్య శబ్దము నపుంసకము. ఉపమానమయిన నదీశబ్దము స్త్రీలింగము.

ఇష్టః పుంనపుంసకయోః ప్రాయేణ॥

ఉపమానోపమేయములకు పుంనపుంసకలింగభేదము ప్రాయికముగా నొప్పుకొనబడినది. ఉ॥ చంద్ర ఇవ ముఖం॥

లౌకిక్యాం సమాసాభిహితా యాముపమాప్రపంచేచ॥

1. లౌకికోపమ—సతస్య ఛాయేవ

2 సమాసాభిహితోపమ—నీలోత్పలసదృశీ భుజలతా

3. ఉపమాప్రపంచము.

"శుద్ధాంతదుర్లభమిదం వపురాశ్రమవాసినో యది జనస్య। దూరీకృతాః ఖలుగుణై రుద్యానలతా వనలతాభిః॥"

వచనభేదముకూడ నిట్లులనే చూచుకొనవలయును.

ఉ॥ పశ్యామిలోచనే తస్యాః పుష్పం పుష్పలిహో యథా" ఇచట నుపమేయమగు "లోచన" శబ్దము ద్వివచనమందున్నది. ఉపమానమగు "పుష్పలిహః" అనునది బహువచనములో నున్నది.

(సశేషము)

వేదపల్లి వెంకటరమణాచార్యులు.

# నాటకరంగము.

ఆంధ్రనాటకరంగమును సకలకళాపరిపూర్ణముగా నుంచుతలంపు దేశమందెల్లెడల వ్యాపించుచున్న నీసమయమున నాటకరంగమునుగూర్చి వ్రాయుట పద్వాదశికశిరోమణుల కానందదాయకముకాక పోదు.

దృశ్యరూపకవిధానమున సర్వజనులకు సుఖసంపదనుగూర్చినకవితలజాలెల్ల నాటకరంగమును ఎట్లుబోషించిరో పరిశీలించుటవలన మహాకవులకు నాటకవిషయమునగల పరిజ్ఞానమును ఆపరిజ్ఞానముతో వారుకల్పించినరంగములును ఈరంగసాధనమున వారుచేసినమహోపదేశమును దెలిసికోవచ్చును.

## పూర్వకాలము.

పూర్వకాలమున బ్రాహ్మణులు నటవృత్తి నుపజీవికగాగొనినట్లు ధర్మశాస్త్రములయందు వారినిగూర్చివ్రాయబడినవాక్యములవలన గానవచ్చుచున్నది. కానియీవృత్తి నవలంబించువారిని శిష్యులనుగా శాస్త్రమంగీకరించినట్లుకానుపించదు.

## కాళిదాసుకాలమునాటినాట్యవిద్య.

జగజ్జేగీయమాననిస్తుల యశశ్శాలియగుకాళిదాసుకాలమునకే యనగా 2000 సంవత్సరములక్రిందటికే, నటకులయందలి ధర్మశాస్త్రాభిప్రాయమునకు సంచలనముగలిగినది.

బుద్ధిమదగ్రేసరుఁడగు కాళిదాసు మాళవికాగ్నిమిత్రమున నాట్యమును గూర్చియిట్లువ్రాసెను.

* " చ. ఇది యమరాళికింగనులకింపగు యజ్ఞమయంద్రు మౌను, లి
య్యది ద్వివిధంబొనర్చె శివుడర్ధసతీసహితాత్మ దేహమం
దొడవురసంబులెల్ల ద్విగుణోద్భవలోకచరిత్రలందిటన్
హృది దనియించు నాట్యమిల నెల్లరును రుచిభేదచిత్తులన్ "

---

* కం॥ వీరేశలింగకవి భాషాంతరీకరణము.

ఇట్లు పరిజాభిప్రాయమునందు గౌరవపదమువహించిన నాట్యవృత్తిని కొన్నికుటుంబములవలంబించినట్లు కానుపించుచున్నది.

కుశలవులలో నొకడు సూత్రధారుని భూమికనుగైకొనిన, నాతని యర్ధాంగి నటీవేషమును దాల్చుచుండును. బంధువులితరవేషములు ధరించెదరు.

"సూత్రి — ఓసీ, అలంకరించుకొనుట పూర్ణముగా నయినపక్షమున నీవిటు రమ్ము.

నటి — ఇదిగో వచ్చితిని...........చక్కగా నాడుటయందు సమర్థులయిన తమకేలోపమును రాదు."

శాకుంతల.

"సూత్రి — నేను గృహమునకుఁబోయి గృహిణిని బిలిచి సంగీతక ముపక్రమించెదను.

నటి — నాకొక్కతెయె కూఁతురు. దానిని మీరేదో దేశాంతరమునందియ్యనుంటిరి.........ఇట్టివిచారముతో నేనెట్లు నాట్యమునిర్వహింపఁగలను?"

రత్నావళి.

"సూత్రి — అతివిస్తారము పనిలేదు. అయ్యా కొంచెమిటుఁరమ్ము.

పారిపార్శ్వకుఁడు — బావా! ఇదిగో వచ్చినాను."

మాళవికాగ్నిమిత్రము.

"సూత్రి — అదె! నాతమ్ముఁడు యౌగంధరాయణవేషమునుధరియించియున్నాఁడు. నీవును రమ్ము. మనమును ననంతకరణీయవేషరచనను సిద్ధముచేయుదము."

రత్నావళి.

అతిప్రసంగమేల. పూర్వోదాహృతోదాహరణములవలన నాట్యవృత్తిని కొన్నికుటుంబములు కుటుంబములే యవలంబించినట్లు కానుపించుచున్నది.

ఇప్పటికిని ఆసాంప్రదాయమును జ్ఞప్తికిదెచ్చుటకో యన కూచిపూడి భాగవతులనియు పరిమిభాగవతులనియు గొందఱింక నీవృత్తిని బోషించుచున్నారు.

కాలక్రమమున నీవృత్తి తోలుబొమ్మలాడు శూద్రులలోను, మాలదాసరులలోగూడ వ్యాపించి నేటివఱకు కొలఁదిగనో గొప్పగనో నిర్వహింపఁబడుచున్నది.

# వేషరచనము.

వేషరచనమందౌచితి యెట్లు పోషింపబడవలయునో కాళిదాసాది మహాకవులక్కడక్కడ సందర్భానుసారముగా నుడివియున్నారు.

* "ఊర్వశి — (తన్నుఁజూచుకొని) సఖీ! చిత్రలేఖా! స్వల్పాభరణభూషితురాలనై నీలిచీరనుఁగట్టుకొన్న నాయభిసారికావేషము నీకు నసమ్మన కెంపుగానున్నదా?

ఆ॥ వె॥ మడుఁగుఁజీరగట్టి మంగళసూత్రి భూ
షలు ధరించి దూర్వలలకఁగూర్చి
వ్రతము పేర గర్వవతిజానముడుగు దే
హమున నలుకదీరినట్లె తోఁచు."

విక్రమోర్వశీయము

"పరివ్రాజిక — తారతమ్యనిర్ణయాధికారమును బొందితినిగనుక చెప్పుచున్నాను. అన్ని యవయవముల సౌష్ఠవమునుఁ జక్కఁగాఁ గనఁబడుటకై యలంకారము విశేషముగాజేయక పాత్రిలను దీసికొనిరండు."

రత్నావళీ.

"సూత్ర —, నాగానందమను నాటకమును చక్కఁగా ఆడించి మమ్ము కృతార్థులను చేయవలయును, అని, కనుక నేనుపోయి వేషము వేసికొనివచ్చి వారి అభిలాషను నెరవేర్చెదను." నాగానందము.

"విదూ — ఇదుగో, మనోరమ నీవేషముధరించి యిక్కడ నేకూర్చున్నది.

మనో — దేవా! సత్యము. ఈయాభరణములచేత దేవర శరీరము నలంకరించుకొందగును. (రాజు అలంకరించుకొనుచున్నాడు)"

ప్రియదర్శన.

నటీభూమికాధారణము సాధారణముగా స్త్రీయే ధరించుచున్నట్టు కానంబడుచున్నది. స్త్రీలు పురుషవేషమును ధరించుటగూడ ప్రాయికముగా గానవచ్చుచున్నది.

---

* వసురాయకవి.

ప్రియదర్శనయందు తృతీయాంకమున నిట్లున్నది.

"అప్పుడు వత్సరాజవేషముతో మనోరమ ప్రవేశించుచున్నది."

తృతీయాంకము.

* సూత్ర—నేనిప్పుడు విక్రమోర్వశీయమను నాటకమును బ్రయోగింపఁ దలంపు గొంటిని. కాఁబట్టి తమతమ వేషములయందు జాగరూకతనుండునదియని పాత్రవర్గముతో జెప్పుము."

విక్రమోర్వశీయము.

పాత్రనిర్ణాయకము.

నాటకప్రయోగమున కుచితమయిన పాత్రముల నిరూపించుటనుగూర్చి గూడ నాటకరచయితలగు మహాకవులక్కడక్కడ కొన్నివాక్యముల నుదాహరించియున్నారు.

మాళవికాగ్నిమిత్రమున రాజిట్లు పల్కుచున్నాఁడు.

* సీ॥ నిడువాలుఁగన్నుల గడునొప్పువదనంబు
శరదాదుకాంతిని జానుమీఱు,
అంసభాగంబుల నందంబునావంగి
బాహువులెంతయు బాగుమీఱు
ఘనమైన నిక్కుజన్గవచేత వక్షంబు
పార్శ్వమందడఁగిన భాతిమీఱు
మధ్యప్రదేశంబుమానుఁగఁ బిడికిట
బట్టంగదగియుండి వన్నెమీఱు
గీ॥ జఘనమెంతయు నమితమై సాటిమీఱు
వంపులైయొప్పు నంగుళుల్ పాదములను
హృదయమున నర్తనాచార్యుఁడెట్లులుండ
నభిలషించునో యట్లుండె నంగగరిమ.

ఇఁట నార్తనాచార్యుడు నాట్యవిద్యకర్హమైనవారెట్లుండవలయునని గోతునో యట్టి యంగసౌష్ఠవము వర్ణితమైనది.

* కం॥ వీ॥

## పాత్రలూరకయుండుట.

నాటకరంగమున బ్రవేశించిన గడియమొదలుకొని నిష్క్రమణమువఱకు పాత్రములు నటనమొనరించుచుండవలయునుగదా! రంగమున నలుగురైదుగురు పాత్రలుండి యందులో నొక్కపాత్రమే పనిచేయుచున్నప్పుడు తక్కినపాత్రములు యథేచ్ఛముగా నుండరాదు. చూపరులకు వారూరకయుండినట్లు గానుపించినను, వాస్తవముగా వారందరచ్చటనుండవలసినవారే. ఒకరు మాటలాడుచుండగా నింకొకరు వారిని వినుచుందురు. ఆవినుటను బ్రయోగించుటలో బ్రయోగకౌశలమెంతయో జూపవలయును. తక్కిన పాత్రములు జనాంతికముగానో స్వగతముగానో యీసంభాషమును వినుచు దాని యోగాములగూర్చి యోజించుచుండవలయును. ఇట్టి యోచనాతిశయమును జూపు ప్రక్రియయు మిక్కిలి నిపుణముగా జూపదగియున్నది. మొత్తమునఁ బ్రతిపాత్రమును నాటకరంగమున బ్రతియవస్థయందును దన యోగ్యతాగుణమునే జూపవలయునుగాని యయోగ్యతను, యసభ్యతను జూపరాదు. సభలో నొక వక్త ప్రసంగించుచుండఁగా తక్కినవారు తమ యోగ్యభావమును వెల్లడించవలయునేగాని, తద్వ్యతిరిక్తమును వెల్లడించకూడదుగదా. నాటకప్రదర్శనకాలమందును, తమకు స్వతస్సిద్ధముగాగల గుణాగుణములలో గుణమునే యెల్లప్పుడు పరిసంగించుచుండవలయును.

దిద్రుక్షువులు ప్రసంగించువాని సంభాషమును జెవులతో వినునప్పుడు నేత్రములతో తక్కినపాత్రముల వస్త్రధారణము తీవి మున్నగువానిని విమర్శించుచుందురు. సంభాషణము చేయనిపాత్రముల బరిదర్శనకౌశలియే నాటకపరియోగమున కష్టమగుటచేత నింతగా వ్రాయవలసివచ్చినది. ఈవిషయము ప్రాచీనమహాకవులు కొంచెముగా సూచించియున్నారు.

మాళవికాగ్నిమిత్రమున కాళిదాసిట్లు వ్రాసియున్నాఁడు.

మ॥ వలయంబుల్ మణిబంధమంటఁగటినొప్పంజేర్చి డాకేలు, ని
శ్చలతన్ రెండవకేలుదాల్చి దిగువన్ శ్యామాలతన్ బోలఁగా
నలరన్ మీటుచు నేలచూపులను బాదాంగుష్ఠమాత్రంబునన్
నిలుచున్నప్పుడె నృత్యకాలమునకంటెన్ జెల్వచెల్వొందెడున్.

## నాటక శిక్షకుఁడు.

పూర్వము, పుస్తకమునుజూచి యెవరికివారేఁ జదివినట్లువారు పాఠి నాటక మాడినట్లు కానరాదు. ఒకనాటకమును పాత్రములన్నియు నొకశిక్షకుని యొద్ద జదివి శిక్షితులైనపిమ్మట నాటకములను బ్రయోగించినట్లు కానుపించును ఇంగ్లాండుదేశమున 90 ఊలంకింపులైనగాని నాటకమును బ్రదర్శింపరని దెలియవచ్చుచున్నది. నాటకములను పాత్రము సెప్పు శిక్షకుడుగూడ నుండవలెనని పూర్వనాటకములయందక్కడక్కడ వక్కాణింపఁబడియున్నది.

ఉ॥ కొందఱు విద్య నన్యులకుఁ గోవిదులయ్యును నేర్పలేరిలన్
కొందఱు బోధసేయుదురు గొప్పగ కొంచెము తాము నేర్చియున్
బొందుగ రెండిటన్ దెలిబొంది వెలింగెడు బుద్ధిశాలులే
యెందును నగ్రగణ్యులని యెన్నికఁ గాంతురు శిక్షకాళిలోన్।

మాళవికాగ్నిమిత్రము

కాళిదాసుడీనాటకమున హరదత్తగణదాసులను నాట్యాచార్యులకు విద్యాస్పర్థగల్పించి యాపయమును మిక్కిలి చక్కగా నుద్ఘాటించియున్నాడు.
" గణ—— నేనుసద్గురుముఖమున నభినయవిద్యను జక్కగానభ్యసించినాడను.
హర—— . . . తమరేయీయనను నన్నును శాస్త్రమునందును బ్రయోగమునందును బరీక్షసేయుడు. మాయల్పజ్ఞ విశేషజ్ఞవివాదమును దేవరవారె నిర్ణయింపఁదగినవారు.

రాజీవివాదమున మాధ్యస్థమున కంగీకరింపక ఆధ్యాత్మిక విద్యాయుక్తయైన త్రియీస్వరూపమో యనదగు పండితకౌశికియను పరివ్రాజికకీభారము నప్పగించెను.

పండితకౌశికి గడసరి. ఆమెకు వీరినాట్యకౌశలమునుగూర్చి యిదివరకే తెలియును, కాని యామెమిక్కిలి నేర్పరియగుటవలన నిట్లనుచున్నది. " మనమిప్పడు పరీక్షించవలసినది వీరికిగల విద్యాకౌశలినిగూర్చికాదు. వీరు నాట్యాభినయవిద్యాశిక్షకులుగదా, వీరిని బరీక్షించుట యనగా వీరిశిక్షకత్వమును (గురు

త్వమును) బరీక్షించుటయొప్పు" ననగా గణదాసుడిట్లుప్రతివచనమిచ్చి యీపరీక్ష కొప్పుకొనుచున్నాడు.

గీ. . . . "చదువునొక్క
జీవనోపాయముగనె తాఁజేపికొనెడి
వాఁడు జ్ఞానవిక్రయుఁడగు వణిజుఁడగును॥"

గణదాసుఁడు దేవిగారితో, మాళవికచేత,

గీ. "నేనుచెప్పినవిద్యను గానిపింపఁ
దలఁచియున్నాఁడ నీవివాదంబునందు
నందుకీవనుమతి యియ్యకుందువేని
విడువఁబడినాఁడ నీచేతవెలఁదినేఁడు॥"

దేవియొప్పుకొనదా గణదాసుఁడాయుద్యోగమును మానుకొందునని ఘంటాపథముగా జెప్పియున్నాడు.

గురువులకు శిష్యజనులయెడగల యధికారము.

దేవి—(తనలో) ఇఁకనేమిగతి? (ప్రకాశముగా) గురువులే శిష్యజనులయెడ సర్వాధికారులు.

పూర్వోదాహృతవాక్యములు నాట్యాచార్యుని శిక్షకతాశక్తి నిగూర్చి చెప్పఁబడినవి. ఇట్టి పాత్రములు యసాధారణమేధావులనితులగు సద్గురువులచేత శిక్షబొంది నాటకప్రయోగదక్షులు కావలయునని యే పూర్వకవులయాశయము.

## నాటకప్రయోగదక్షత.

కాళిదాసాది మహాకవులెల్లరు తామురచించిన నాటకములను ప్రయోగకౌశలితోఁ బ్రదర్శింపబడవలయునని యేసంకల్పించినట్లు గానవచ్చుచున్నది. శాకుంతలమున

" నటి—చక్కఁగా నాడుటయందు సమర్థులైన తమకేలోపము రాదు.
సూ—తలఁపనాడు ప్రయోగకౌశలము మంచి
దంచుఁ బండితుల్ సంతోషమందువఱకు"

రత్నావళిలో

"నూ—మమ్మున్ దక్షులండ్రాట—జేకూరెను సర్వలాభములు మహాభాగ్యంబు నింకేమనన్"　　　　రత్నావళి

"సూత్రి—చక్కఁగాఆడించిమమ్ముకృతార్థులను చేయవలయును." ఇట్టివాక్యము లవలన నాటకప్రయోగదక్షత యెల్లెడల నపేక్షింప బడుచున్నదనుట స్పష్టము.

నాటక ప్రయోగాతిశయము

మాళవికాగ్నిమిత్రమున మహాకవికాళిదాసుడు ప్రయోగలక్షణము నీక్రిం దివిధముగా నిర్వచించియున్నాఁడు.

చ.　పలుకులయర్థమంగములు బాగుగ గన్పడుచుంబడెన్ రసం
　　బుల లయతోడ నైక్యమును బొందెఁబదంబులు వెట్టురీతి, యిం
　　పలరెను గొంచెమై మృదుకరాభినయంబు వరానువృత్తులన్
　　వెలసె మనోహరంబగుచు వింతగభావము రాగ బద్ధమై.

నాటకమందలి రసభావవినియోగము

నాటకాంగమగు భరతము, భావరసవిధేయమనియే ఔచితీవేదియగు కాళిదాసుని నిశ్చితాభిప్రాయము. భావరసమును గూర్చినిర్వచనము సేయుట దుష్కరము. కాళిదాసాదు లీవిషయమునుగూర్చి క్వాచిత్కముగా జెప్పినయుపదేశములు దాహరించెను.

మాళవికాగ్నిమిత్రమున, మేధావినియు, పరమనిపుణురాలగు మాళవిక నుగూర్చినాట్యాచార్యుఁడగు గణదాసుడిట్లుచెప్పియున్నాఁడు.

క.　ఏయదిభావము తెల్పెడి
　　యాయభినయ విషయమామెకై నేర్పెదనో
　　యాయది విశేషముగపడఁ
　　జేయుచు నాకెదురునేర్పు చెలువుననుండెన్

గానము

ఇచట గురూపదిష్టమగు నభినయమును విద్యార్థినిభరత శాస్త్రసంప్రదాయానుగుణముగా నేర్చుకొనుచు, వ్యక్తివిశేషమునుబట్టిరసభావప్రకటనమునందెం

తయో స్వాతంత్ర్యమగపరచినట్లు చెప్పఁబడియున్నది.

కవికావ్యనటాదులపరిశంసగలపరిరోచనాంగమును ప్రాచీనకవులు రసవిస్తారముగా బోషించియున్నారు.

* క. కోకిలవ తంసింతురుజదర
తమకింపఁగ భ్రమరరా చుంబితమున్
సుమృదుల కేసరశిఖమున్
సుమనోరాజను శిరీషసుమరాజంబున్

ఇచట సభను రాగలగ్నమును గావించినది నటీగానమే గాని గానమందున్న భావమాత్రము గాదు.

సూత్ర — !అగా చక్కఁగాఁబాడితివి. ఆహా! చిత్తవృత్తులు రాగమునంటిపోగా నంతటను సభ చిత్తురుపోయన నిశ్చేష్టముగానున్నది. చెప్పుము ఏరూపకమును బయోగించి యిప్పుడీ సభనారాధింపుదము. ''

ఇఁటరాగకవశతయేగాకున్న ఏరూపకప్రదర్శనమున సభనారాధింపుదము నుట పౌనరుక్తగును.

నటిపాటబాడగా సభ, సభతోపాటు సూత్రధారుడును నిశ్చేష్టితులైనారు. ఈగానమునకు లయతాళాంగసంజ్ఞల బిగింపులునిర్మించలేదు. నటికి సభనురాగగ్నాంచితము గావించుటయే పరమోద్దేశము. ఆయుద్దేశమును గాననిపుణయగు నటియేనిర్వహించగల సమర్థ. ఆగానమింతలోగావలయునను కాలనియమములేదు. ప్రరోచనయనెడి ప్రస్తావనాంగమున శృంగార రసప్రధానములు నాటకములందెల్లెడల గానమున కగ్రస్థానమీయఁబడినట్లు కానుపించుచున్నది. సంగీతవిద్యయు, నాట్యవిద్యయు, దినదినపరివర్ధమానములనియు, నవివ్యాక్షేపమునుబట్టి నిత్యోదయశీలసితములనియు మహాకవులతాత్పర్యము.

క. ఏయాదిభావము తెల్పెడి
యాయాభినయకపయమామెకై నేర్పెదనో
యాయదివిశేషముగ పడ
జేయుచు నాకెదురనేర్పు చెలువుననుండెన్.

* [ శ్రీమద్ వేదము వెంకటరాయశాస్త్రి.

అని నాట్యాచార్యుని చేత కాళిదాసు డనిపించుటవలన, అభినయము చెప్పినదానిని చెప్పినట్లు గాక, విశేషము గపడునట్లును, ఆవిశేషము లొకప్పుడు గురువు నైతము నేర్చుకోదగినట్టిది గానుండవలయుననుట గ్రహింపఁబడఁదగియున్నది.

వేదము లెట్లు కఠిననియమములవలన స్వరము చెడక సంరక్షింపబడుచున్నవో, నాటకములును, నాటకలక్షణమువలన సంరక్షింపబడుచున్నవే గాని, బుద్ధిమంతుల బుద్ధిని వెలయించుటకు వీలయినంత స్వేచ్ఛ లేకపోలేదు. కాని నియమము లేకున్నచో బొత్తిగా మార్గమే చెడిపోవును. కాబట్టి సంగీతమును గట్టులచే బిగింపక, గాయకుని శాస్త్రోచితమయిన స్వాతంత్ర్యముచే విలసిలునట్లు మహాకవుల యాశయము.

ఇతరనాటకకవులును ప్రరోచనాంగము గానప్రధానము గాఁ గాంచియున్నారు. నటకీయంగమే ప్రధానాంగము. ప్రియశనటికి నాటకాంతరమున బ్రసక్తి లేకపోవచ్చును. ఐననేమి, ఎన్నియేండ్లో నేర్చుకొనినగదా సూత్రధారుడు గూడ మైమరచునట్లు గానము చేయుట. సభాస్తారులను ప్రథమమున గానమున వశంవదులగావించుకొను నాటకసమాజము, వారికి నాటకభావములను వెల్లడించి హృదయంగమము గావింపకపోజాలదు. శ్రీహర్షదేమనెనో చూతము గాక.

క. విరసఘనబంధనపయో
ధరమార్గము గాంచి తనదుదయితఁ గొని సుం
దరమానసధామంబున
కరుగఁగ నభిలాషి రాజహంసంబయ్యెన్.

మఱల గానము చేయుచున్నది.

గీ. అభినవానురాగశిష్టనైన యళిని
ప్రియునిఁ బ్రియదర్శనునిఁ జూచు వేడ్క మదినిఁ
గోరుచున్నది నై యతి కుటిలమదన
పటునిశాతమార్గణ బాధపడెడుకంటె.

రాజు—(సమీక్షించి) మేలు, రాజపుత్రీ! మేలు. ఏమీగానము! ఏమీవాద్యము ?

గీ. దశవిధవ్యంజనామల ధాతురక్తిఁ
దెలుపుద్రుతమధ్యలంబిత త్రివిధలయలఁ
దనరి, గోపుచ్ఛముఖయతిత్రయిని సత్వ
మోఘమనుగతవాద్యంబు లొరసెనౌర.

కాళిదాసుని నటీగానమువలె నిచటను గానవిషయము గాక, గానము వాద్యమే ప్రధానమని రాజుపల్కులవలన దెలియవచ్చుచున్నది. గానము శాస్త్రనియమానుసారముగ నుండవలెననుటయు బ్రస్ఫుటమగుచున్నది.

కాళిదాసభావముల పూర్వాపరతనుగూర్చి యిపుడు విమర్శింపవలసినపని లేదుగదా. వారిరువురికిగల నాటకరంగపరిజ్ఞానమునుగూర్చి వారివారిగ్రంథముల నుండియే నిదర్శనములుదాహరింపబడియెను. ఏవంవిధరంగస్థలపరిజ్ఞానకలితులై తమనాటకములయందలి రంగస్థలముల నెట్లు చిత్రించినారో చూచెదము.

(సశేషము)

నందిరాజు చలపతిరావు.

# The Maharajah's College Magazine,

## VIZIANAGRAM.

*A Quarterly journal mainly devoted to Research.*

Vol. I. | JANUARY, 1922. | No. 2.


## RESEARCH IN INDIAN HISTORY.


BY MR. M S. RAMASWAMY IYENGAR, M. A.


"*Whatever sphere of the human mind you may select for your special study, whether it be language, or religion, or mythology, or philosophy, whether it be laws or customs, primitive art or primitive science, everywhere, you have to go to India, whether you like it or not, because some of the most valuable and most instructive materials in the history of man are treasured up in India, and in India only.*"—*Max Muller.*

THE greatest gift of the West to the East is the spirit of research, an eagerness and aptitude of mind to investigate into the past acquisition of Indian intellect and culture. Different branches of science and learning our ancients did possess and according to tradition they number fourteen. But the science of history, the art of narrating the story of Indian religions and political evolution, based on firm chronology, is of comparatively recent origin. Gœthe's ideal historian whose duty should be to separate the true from the false, the certain from the uncertain, doubtful from those which cannot be accepted, was certainly absent amidst the group of 'native' chroniclers, ancient and medieval. It is indeed hard to refute the oft-repeated statement of that prince of epigraphists, Dr. Fleet, that 'we are indebted but very little and not at all for the most ancient periods, to any historical works compiled by the Hindus themselves'. But if the Hindus were lacking in historical instincts, the religious side of their character was pretty strongly developed and their desire for making endowments on every occasion rendered the growth of epigraphic records possible and it is from these that the main frame-work of early Indian History has been constructed Kalhana's *Rajatarangini*, the historical chr

torical results obtained from the inscriptions. It will perhaps be more to the purpose to record what still remains to be done. The earlier Orientalists unfortunately exhibited a tendency to ignore the Puranic accounts and in their attempt to 'reduce to proper limits' these and other traditions enshrined in 'native literature' indulged in reckless distortion of original texts. Their conclusions which have, however, found general acceptance, require revision in the light of new facts. At least one scholar, in recent times, has doubted the Synchronism of Alexander the Great, and Chandragupta Maurya and suggests a new hypothesis of synchronising Alexander with Candra, the Gupta, as this will be in consonance both with the old Hindu and Buddhist records. Another point requiring consideration at the hands of scholars is in regard to Arthasastra. At the time when the MSS. were discovered by Mr. Sham Sastry of Mysore there was a flutter and excitement among scholars which exhibited *themselves* for a long time in an endless series of translations, commentaries and lectures based upon the original texts. It was at that time piously believed that the Arthasastra was the production of the wily Brahman minister of Chandragupta Maurya, Canakya or Vishnugopa. Prof. Jacobi supposed it to be so. A critical examination of the texts, however, gradually led to divergence of views on the subject and to-day the genuineness of Kautilya's Arthasastra is seriously doubted. Prof. Hillebrandt has attributed the authorship 'to a member of the school of Kautilya and not to the great Canakya himself'. Sir Ramakrishna Bhandarkar has recently enunciated the view that the book was not written so early as in the times of Chandragupta, the Maurya, but later. According to the revered Doctor, date to which we can refer Kautilya is th[illegible] or the second century of the christian era. If this is so, our notions regarding Pre-Mauryan and Mauryan polity must undergo some change Here is therefore work for further research and the general value and importance of Arthasastra depend on our being able to fix the age for it.

The student of Indian History desires to know more about the Sunga and Kanva dynasties but inadequately sketched hitherto. The essentials of the Gupta Empire are now known to us but there is ample scope for considerable revisions of our opinions regarding one at least of the Gupta sovereigns. Samudra-gupta, 'the Indian Napolean,' of V. A. Smith, after a closer examination of the records dealing with him, dwindles into comparative insignificance as has recently been demonstrated by the illuminating monographs of G. T. Dubreuill. The age of Kalidasa, one of the Nine Gems that are supposed to have existed in the court of ChandraguptaII, Vikramaditya, is still a vexed question. Indeed with the great advance that the sciences of Indian archæology and epigraphy have made, it should be possible for us to write full and detailed cultural history of the Gupta period, a period when Hindu art and literature found some of their best exponents. The most confusing of the periods of Indian History is the dynasty of Kanishka. Theories and dates are originated, circulated for acceptance through the medium of text-books and then destroyed, fresh ones are started and thus there is endless speculation regarding the chronology of what may be termed the 'Kushan' period of Indian history. The learned articles of the Patna scholar,

Jayaswal, on the subject are not easily accessible to the general public who are as much interested in the details of Indian history as the undergraduate preparing for an examination. The theories that now hold sway in regard to the origin of the dynasties of the Deccan do not appear to be sound. There is an ever increasing volume of evidence to show that the so-called 'foreign' dynasties, those of the Gurjaras, Chalukyas, Rashtrakutas and Pallavas were really indigenous and that they have nothing foreign about them. Indeed the time has come for young critical scholars to declare their intellectual revolt against the acceptance as truth of whatever that is printed even though under the authority of well-known authors whose interest in Indian History may be genuine. In the words of India's Poet, Dr. Tagore, let us cease to be parasites fattening on others' toils which is a symbol of disease and laziness.

From what has been stated above, it is clear that the real history of early North India is still in the making. The position of South Indian history is still worse. Various circumstances contributed for the gross neglect of the South of India in the field of historical investigation. The first batch of European and Indian scholars who took a genuine interest in Indian studies all belonged to Bombay or Bengal. They were interested more in the history of Northern than in that of Penunsular India. Most of the North Indian Vernaculars closely allied to Sanskrit lent themselves to an easy mastery of Sanskrit and Prakrit, a knowledge of which was so essential for epigraphic studies. Benighted Madras was busy supplying clerks to the various government offices in the country and did not respond to the trumpet call of Bombay to take its share in the patriotic duty of rewriting the history of our motherland in the light of new facts discovered and with the help of new sciences that were ushered in, while the auxiliaries of the Journal of the Royal Asiatic Society in Bengal and Bombay continued to thrive, its Madras auxiliary, the Madras Journal of literature and science died a premature death, unwept, possibly unhonoured. Sir Walter Elliot's splendid collection of Tamil and Telugu records did not evoke any enthusiasm in the minds of South Indian scholars. Dr. Hultzsch's *South Indian Inscriptions* came somewhat late on the scene. The Siren voice of Bishop Caldwell and others of his ilk who, in no uncertain terms, deprecates the value of Dravidian literature for historical purposes, has smothered all interest in research in South India. These and other circumstances explain why Madras has not produced men like Sir R. Bhandarkar, Telang and Apte.

And yet it cannot be said that Madras was devoid of materials for reconstruction of history. The extreme South of India, far away from the centres of Muslim fanaticism, had not fortunately experienced the ravages of the iconoclast and our temples, stone tablets and inscriptions were kept in tact. It will be idle to maintain that these innumerable records, numbering thousands, were either exploited for purposes of history or could not be manipulated to furnish data for the reconstruction of South Indian History. Equally futile will be the contention that inscriptions were scanty or none at all for the period anterior to the 7th Century A. D., and those that are posterior to this; are uninteresting and

not so charming as North Indian records are for earlier periods. The very absence of stone inscriptions and copper-plates for the first seven centuries of the Christian era in a land which possessed a noble literature and culture, by no means inferior to those of the north, ought to have excited the curiosity of Madras scholars to an investigation of the whole matter. The want of epigraphic records, however, is more than amply compensated for by the existence of theSangam and post-Sangam literature which if studied in a proper spirit, becoming of an investigator into truth, would have yielded results as important as those furnished by epigraphy That this is exactly so is demonstrated by the present occupant of the Madras University chair of Indian history and archæology. The fact is that just as the European novice is hypnotized into the belief that there can be no Indian historical or literary event that is not influenced by Greek, Roman or Christian thought,so theDravidian scholar is persuaded to believe for a long time—and the spell is still not broken—that great and ancient centres of civilization are to be found in the valley of the Punjab, on the banks of the Ganges and the Mahanadi. "The attempt to find the basic element of Hindu civilization by a study of Sanskrit and the history of Sanskrit in Upper India, is," says the late lamented Prof. Sundaram Pillay with some slight but pardonable exaggeration, "to begin the problem at its worst and most complicated point. India, south of the Vindhyas-the Peninsular India-still continues to be India proper. Here the bulk of the people continue to retain their pre-Aryan language, their pre-Aryan social institutions. Even here the process of Aryanization has gone indeed too far to leave it easy for the historian to distinguish the native warp from the foreign woof. But if there is anywhere any chance of such successful disentanglement, it is in the south and the farther south we go, the larger does the chance grow. . . . The sceintific historian of India, then, ought to begin his study with the basin of the Krishna, of the Cawery, of the Vaigai, rather than with the Gangetic plain as it has been now long, too long, the fashion."

The task before us then, is clear. We want men and material, more men than material, men imbued with a genuine spirit for research, with critical faculties fully developed. And yet material in the shape of rare texts and originals of inscriptions,is not of secondary importance The progress of research, especially Indian research in all its manifold directions, depends a good deal on the way in which the historical materials are dispersed. Unfortunately, Oxford and the India office are to-day considered better centres for Indian studies than Madras or Calcutta, Hodgson, for example, sent to Paris a good collection of the writings of Northern Buddhism and Paris, forthwith, became a great centre of Buddhist learning, Burnouf, Senart and Levi becoming the best exponents of North Indian Buddhism The splendid collection of Pali MSS deposited at Copenhagen by Rask enabled the Danish capital to produce such distinguished Pali scholars as Westergard and Trenchner. Similarly the India office and Bodleian have become centres of Indian learning through the manuscript libraries of Wilson and Colebrooke. It is therefore important that fully equipped libraries should be instituted

in convenient centres of the Presidency to which aspiring scholars can flock to enrich their knowledge. Our University must also be made to understand that with the best of intentions and fullest of knowledge, a single Professor for Indian history, holding his office at the whim of an ever vascillating Senate, is utterly inadequate to deal with the ancient history of a people, vastly differing in culture and social life. It is an absolute desideratum that an additional professor of South Indian history, fully conversant with the traditions, literature and social life of the Andhradesa should be appointed with the exclusive duty of unearthing the early history of Kalinga, of which so little has been written. The few Sanskrit colleges that are scattered in the Presidency of Madras should try to contribute their mite towards the reconstruction or the discovery of our ancient culture, by ceasing to produce pundits of the old type and turning real scholars of pupils who will not only repeat Vedic texts, and ingeniously explain metaphors and similes but will take up the study of the vast and abounding literature of Sanskrit in the broader and fuller spirit of historical enquiry. Let us above all remember the words of India's greatest living orientalist, Sir Ramakrishna Bhandarkar, that "between the Western and Indian scholars a spirit of co-operation must prevail and not a spirit of depreciation of each other. We have but one common object, the discovery of truth. Both, however, have prepossessions and even prejudices and the same evidence may lead to their arriving at different conclusions. Often, however, when controversies are carried on, the truth comes out prominently and there is a general acquiescence when it does go."

---

# KAUTILYA ON THE FINANCES OF THE STATE.

BY MR. M. VENKATA RANGIAH, M. A.

*(Non-tax resources.)*

THE Arthasastra of Kautilya throws a considerable amount of light on the financial resources of the state in ancient India. Much of the information on this subject is contained in the second book while many statements bearing on it are scattered here and there in the first, third and fourth books. There is in the fifth book a chapter entitled, "The replenishment of the treasury," specially devoted to an explanation of the expedients resorted to by kings in times of severe financial stringency and stress. It is with the help of these portions of the treatise that this paper has been prepared. It was not found possible to interpret exhaustively all the technical terms used by Kautilya or to compare his views on public finance with those held by the other great Sanskrit writers on politics. What can be gathered from a study of Arthasastra itself is all that is attempted here.

I. The primary fact that strikes a student of Kautilya is that for financial purposes the state was in those days organised more or less like a self-sufficient household Very many of the commodities required for the management of the state and the conduct of administration were produced by the government itself and not purchased with the money

